Regd No M. 3289 విడిప్రతికఅణా Regd No. N-45

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ ౹౦౩|౦| ఏప్రెల్ ౫ వ తేది ౧౯౩౭ సోమవారము అర్ధసం॥ చందా ౩

సంపుటము ౧౧ } తూపుబజారు, హైదరాబాదు - దక్కన్. శా. శ. ౧౮౫౯ = శ్రీధాతసం॥ ఫాల్గుణ బ॥ ౯ సోమవారము = ౧౫ వ ఖుర్దాదు ౧౩౪౬ ఫ. { సంచిక ౯౦

బెజవాడలో మొన్న ౨౭ మార్చి ౨౮ వ తేదినాడు సమావేశమైన ఆంధ్రనాటక కళాపరిషత్తుయొక్క ఆరవ సమావేశమునకు అధ్యక్షతవహించి శ్రీయుత పింగళి లక్ష్మీకాంతముగారొసగిన అధ్యక్షోపన్యాసమునుండి ముఖ్య భాగము లీ క్రింద ప్రకటించబడుచున్నవి:—

# ఆంధ్రనాటక కళా పరిణామము

## శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు

ధార్వాడ కంపెనీవారు మనరాష్ట్రమున రాకపూర్వము మనదేశి నాటకము లైన యక్షగానము లేకాని, మార్గనాటకములు లేవు. ఆ యక్షగానములపరిణామమే యీ నాటకములని కాని, వానిక్రమంతరించినపిమ్మటనే వీనియావిర్భావమయ్యెనని కాని తలపరాదు. ఆంధ్రవాఙ్మయమున దేశి-మార్గయనెడి రెండుభిన్నశాఖలు కలవు. ఇరెంటికిని ఒకొక్కయెడ కొంచెము గాఅన్యోన్యగుణసంక్రమణముండిన నందును గాని జన్యజనకసంబంధముమాత్రము బొత్తుగా లేదు. ఆరెండిటిలో దేశిశాఖకు చెందినది యక్షగానము.

మార్గపరణికి చెందినది వనవాటకము. నాట్యమనెడిసాధర్మ్యము తప్ప రెంటికినిచాలభేదమున్నది రచనయందును, ప్రదర్శనమునందును దానిప్రక్రియవేరు, దీనిప్రక్రియవేరు కావున వని వీనికిమాతృకలుకావు. అదియునుగాక ఆ యక్షగానములిప్పటికిని తమదారినితాము సంచరించుచునేయున్నవి. కావి యంతరించిపోలేదు. మార్గకవిత్వమైనప్రబంధముతోడి పోటీకి తాళజాలకంతమాత్రమున, దేశికవిత్వమైన పలనాటివీరచరిత్ర యస్తమించిపోవునా? కేవలప్రబంధపఠనమే చెప్పెడివారు పలనాటిపదమును వినవొల్లకున్నను పచ్చుటంటులచే దానినిపాడించినవి మైమరచిపోవుప్రజలు పల్లెలలోవ నేకులున్నారు.

మళయాళదేశమునందు కథాకళియనెడి నాట్యవిశేషము చిరకాలమునుండి ప్రశస్తికెక్కియుండి, ఆధునికనాగరకత ప్రబలినతరువాత సన్నగిలగా, స్వదేశాభిమానమును తద్విద్యాగౌరవమునుఎరిగినమహాశయులు దానినాదుకొనిపునరుద్ధరించి యునకీర్తి వినడించుచున్నారు. అదృష్టాంతము నైవముచూచి మనము కూచిపూడివారి యక్షగానప్రదర్శనము నెడ తగినంతయభిమానముచూపుదుమేని అభాగవతులప్యరాష్ట్రములకు పయితమేగి ఆంధ్రరాష్ట్రమున కంతో ఖ్యాతినిలొనిరాగలరు.

నృత్తము, నృత్యము, నాట్యము అనెడిమూడుపదములను సాధారణముగా లోకము సమానార్థములుగానే వాడుచుండును. అదిపొరపాటు, ఈమూడుపర్యాయపదములుకావు.

### నృత్తము

శరీరావయవవిక్షేపములయాన్వితము చేయ నెంచినప్రోక్తమానవుడు మొట్టమొదట నృత్తించు మొన్నకళనృత్తము. వీరటవాద్యమో, నెరప్రమతాళమునకు నముగుణముగాలయశుద్ధియుప్పునట్లు, అతడుచూపినపాదన్యాసమేనృత్తమునకు ప్రారంభదశ. క్రమముగాదానిని అన్ని తాళములకును అన్నికాలములకును అనురూపగాప్రపంచించిపెంపుచేయవలెనని యాతడుయత్నించెను. ఎంతయత్నించినను పాదన్యాసము తాళమునకుదమట్ట ననుగమింపలేదు. హస్తాదులకుగలలాఘవము పాదాదులకునుండదు గనుక హస్తముతోచేయు తాళగతులవన్నిటిని పాదముతోచేయు నృత్తగతులన్నియు ననుసరింపలేవు. కనుకనృత్తవిద్య తాళముతో కొంతమూకమేపడచినది. నృత్తము చేయునపుడు పూర్వాపరకాయములకు సమతేసదుటకై వేరొకదశలోనాపనిక్షేపమునకు శబ్దముదోటిసంబంధమించుక యుండు అనగానృత్తము చేయునప్పుడు తాళమేయుపేక్షింపబడునుగాని గీతము పేక్షింపబడదు

### నృత్యము

ఈగాత్రవిక్షేపవిద్య తాళలయాన్వితముగా నుండుటయేకాక శబ్దార్థసూచకముగాకూడనుండవలెననెడియాశతో, మానవుడుకల్పించిన ప్రక్రియాంతర నృత్యమ్మ నోటితోగీతముపాడుచు అంగలికములయర్థమును చేతితోప్రదర్శించుట దానిప్రధానాశయము. అపాడెడిగీతము తాళబద్ధముగానుండును గనుక తాళమునకు తగినట్లు కాలితోనృత్తము చేయుట దానికొకయంగము. కావున నృత్యమునందు అర్థసూచకమైన హస్తన్యాసమేకాక యొకొక్కయెడ శాస్త్రీయమైనన్యత్తముకూడ ప్రకటితమగుచున్నది. కృష్ణలీలాతరంగనృత్యమును చూచినపుడు మనకిదితార్క్కాణయగును. నృత్యము, నృత్తముకంటె గుణాధికమై, శాస్త్రనిబద్ధమైనది. అందుచేతనే దానిని మార్గమనియు, నృత్తమును దేశిఅనియు లాక్షణికులు పేర్కొనిరి. గీతిపాడికరయే యర్థవంతము గా నృత్యములనుపల్పుట తరువాతక్రమముగాకలిగిన పెంపులలో నొకవిశేషము. భారతీయనృత్యమునకు విజయపతాకగా నేడు ఖండాంతరము సంచరించుచున్న ఉదయశంకరునినృత్యమే ఈవాక్యమునకుదృష్టాంతము. మిశ్రకళలలోని యంకకళకు కెంతసామరస్యమున్నదో, యంతస్వర్గమున్నది. సంగీతమునకు కదా సాహచర్యములేకున్నను నాట్యము నిర్వాకలదనిచూపుటకే కలాకరినంటి మూకాభినయము యత్నించినది.

మరికొంతకాలమునకు నృత్యము శబ్దార్థముచేకాక భావాశ్రయమైన వాక్యార్థమునుప్రయితము ప్రకటింపవలెనని మానవుడింకొక సంస్కారముచేసెను. తత్ఫలముగా గాత్రవిక్షేపవిద్య కొంతయవస్థాముక్తిచ్చెను. అభినయముపేరుదాల్చినది. క్రియాపదములు, భావశీలములోనగునవిప్రదర్శితము లగునప్పుడు దాని స్వరూపమును ప్రత్యక్షముగాచూడగలము.

### నాట్యము

ఈయభినయమునకు మీదిమెట్టే నాట్యము. రెండింటికినిగల సన్నిహితత్వమునుబట్టియే అభినయశబ్దము నాట్యపరముగా నయితే ముపయోగింపబడినది. వ్యస్తములైనపదములను, భావశీలనమాత్రమేకాక నిబద్ధకావ్యములయిన నాటకములనుగూడప్రదర్శించుటవలన అభినయము నాట్యమైనదికాగా, భావగీతమువంటిది పదము లయాభినయము, ప్రబంధమువంటిది నాట్యము.

కూచిపూడివారి నాటకప్రదర్శనమున నవనాగిరకులుపహేంపనిచ్చెదులు (తొక్కుటలు), చేతులుప్పటలు. నాట్యవిద్యా పరిణతిలోని యాభిన్నభిన్నదశలను మాపుటకును, నృత్తనృత్యనాట్యమిశ్రీకరణమువలన ప్రదర్శనమునకు లభించుసమగ్రలయసిద్ధిని చూపుటకును ఉద్దేశింపబడినవి. కావున యక్షగాననాట్యము నృత్తనృత్యాను ప్రాధాన్యము నిగ్రహింపవలెను. పూర్వకాలమున సంస్కృతనాటక ప్రదర్శనమందును నృత్తనృత్యములకు యథాభావరసావస్థను గాస్థాన మొసగబడినది కొంచెమునృత్యము [పదార్థాభినయము] మాత్రము నిల్చియున్నది తక్కినదంతయు నాట్యమే [అవస్థానుకృతి].

ఇట్టిదశాపరిణామము నాట్యకళకేకాక, తక్కినచిత్రకళకును సహజమైయుండినట్లే కన్పట్టుచున్నది. సామవేదకాలమున త్రిస్వరాత్మకముగానే యున్నగానము, రామాయణకాలమునాటికి సప్తస్వరాత్మముగా పెంపుగినట యుట్టిదే!

ధార్వాడకంపెనీ రాకయు, మార్గనాటకావతారమును సమకాలికములుగావ, అదిజరిగినుమారేబదిసంవత్సరములై యుండును. ఈ యర్థశతాబ్దిలో దీనికి మూడుదశలు గడచినవి, నాల్గవది నడచుచున్నది.

### గద్యనాటకములు

మొదటిదశలో వెలువడినవి శుద్ధగద్యనాటకములట, వానినిచూచినవారు మనలోనెందరోయుందురు. అప్పటిపెద్దలుచెప్పగా వినినమాటలనుబట్టి మాటచనలురసవంతముగా నుండెడివనిచెప్పవలెను. అప్పటినాటకసంఘములు మంచికట్టుబొట్లను భక్తిశ్రద్ధలునుగలిగి యంతరైక్యముతో చక్కగానిర్వహింపబడినవట. వేషధారణమును, నేపథ్యరచనమును తగినంతసాధనసామగ్రిలేకున్నను, ఉన్నంతలోనే చక్కగా మెరపించిరట.

### అనువాదములు

రెండవదశలో వేణీసంహార శాకుంతలాది సంస్కృతనాటక పరివర్తనములును, చిత్రనళీయాది స్వతంత్రనాటకములును వెలసినవి. ఆ నాటకకర్తలలో ధర్మవరముకృష్ణమాచార్యులుగారు నాటకములువ్రాయుటేకాక, స్వయముగానాని నాడియాడించిరి. నాటకమువ్రాయుట, నాటమాడుట, నాటకసంఘమును నడపుటలోనగు సమస్తకార్యభారము వహించి యు చిరకాలములో నీవిద్యను వారెంతో యున్నతికి కొంపోయిరి.

### నాటకనట పితామహుడు

ఆంధ్రనట పితామహుడుగా లోకముచే నెన్నబడి రంగజ్యోతి హరిప్రసాదరావుగారు కృష్ణమాచార్యులుగారు నాటకమును ప్రతిష్ఠింపగా ప్రసాదరావుగారు నాట్యమున పదపదమును ప్రతిష్ఠించెనని చెప్పుదురు. వీ పద్యమున కు నేరసముకేదాగ మెంతవరకుచిలికొ యారాగమంతవరకేనాటి. పద్యసారస్యము రాగరక్తిని, సదిమెచెడకుండ నాకము నోవి వానిసాయమున నాట్యము ప్రతిపకరప విష్యందియుకట్లు అభినయించు నేర్పు నేటికినంతవరకు ప్రసాదరావుగారికివలె నింకొకరికి నలవడలేదు.

ఈరెండవదశ లోనూడ కంపెనీలు వినోదసంఘములుగానేయుండెను గాని వృత్తిసంఘములు గావాగలేదు.

### కంపెనీలు

నాట్యకళాభిమానులైన ధనికులును, జమీందారులును అమిత ధనవ్యయముతో పెద్దపెద్ద కంపెనీలలోని ప్రధానపటులనందరిని అకర్షించి యొక్కచోటచేర్చుటయే ఆనూపట్టణములోని కంపెనీలు విచ్ఛిన్నములగుటకు హేతువైనది. ఈవిద్య వృత్తిగా పరిణమించినదియును ఈపెద్ద కంపెనీలవల్లనే! ఈ పరిణామము వలన పెక్కుమందినటులకు జీవికకలిగినది. పదిమందికి జీవనాధారము కల్పించుటయే యీపెద్దకంపెనీలు చేసిన మొదటిమేలు, ఈమేలునుబట్టి చాలకీడునవచ్చినదందురా? అది వటులలోపముగాని తయజమానుల దోసముకాదు. నాట్యమును వృత్తిగాచేసికొనుట హేయమని తలంచువారు మనదేశములో చాలమందికలరు అయుక్తిప్రాయమంతగా మెచ్చదగినదికాదు. పెద్దచదువులు చదివినవారే వృత్తులుదొరకక యల్లాడు మనదేశములో కొంతమందికేని యొకసద్వృత్తి దొరకుట సంతోషింపదగినదికాదా?

### స్త్రీలు నాట్యరంగము

ఈనాల్గవదశలో జరిగిన యొకసంస్కారము స్త్రీలు పాత్రధారణముచేయుట అసంస్కారమువలన చెప్పికొనదగినంతఫలముకలుగలేదు. సురభికంపెనీవారికిని చిరకాలగతమైన యాచారము అనుమానము లేని స్త్రీపురుషులు ఏకకుటుంబమునకు చెందినవారగుటచేత, అపద్ధతి నవలంబించుట వారికే సుకరమయ్యెను. తక్కినచోట్లనది దుష్కరము. ఈప్రయత్నము కడమట్టునాయని సందేహముకొల్పుచున్నది. సాగునాసంతోషమే, సాగనప్పుడు పురుషుడు స్త్రీ

వీనస్: నిజాంరాష్ట్రమునకొక లోకల్‌బోర్డు స్థాపించినది ౩ వ పేజి చూడుడు




# గోలకొండ పత్రిక

ధాతునామ సం॥ ఫాల్గుణ ౨౪

సోమవారము


## శ్రీ॥ శే॥ నవాబు లుత్ఫుద్దౌలాగారు

నవాబ్ లుత్ఫుద్దౌలా బహదరుగారు కీర్తిశేషులైరను వార్త విని మన రాష్ట్రమందు వ్యసనపడని వారు లేరు. వీరు కొంత కాలమునుండియు జబ్బుగానుండి, స్థలము మార్చిన నెమ్మది కుదురునను ఆశతో యూరోపుఖండమునకు పోయియుండిరి. ఇటీవల వారికినెమ్మదిగానున్నట్లును, వారు ఒయలుదేరి హైదరాబాదు వచ్చుచున్నట్లును వార్తలువచ్చి యుండెను. ఇంతలో వచ్చిన వార్తలనెల్ల కల్లజేయుచు వారు అకస్మికముగ తమ భౌతిక దేహమును వీడి, ప్రజలనెల్ల దుఃఖాబ్ధిలో ముంచినారు హైదరాబాదు స్టేషనుకు తేబడినకీర్తిశేషులకళేబరముచూచినపుడు మహారాజా కిషన్‌ప్రసాద్ బహదరుగారు అవశులై కన్నీళ్లుకార్చిరి.

లుత్ఫుద్దౌలా బహదరుగారి వంశము మన రాష్ట్రములో అసఫ్‌జాహీ వంశము నెలకొనిననాటినుండియు చాల పెరుగల వంశము. పాయెగాలలోవీరిదిచాల ముఖ్యమైనది. వీరివంశీయులలో ప్రధానమంత్రి పనిచేసినవారును, సైన్యాధిపతిపని చేసిన వారును ఉండిరి. కీ॥ శే॥ లుత్ఫుద్దౌలాగారును కొంతకాలము పోలీసుశాఖ, వైద్యశాఖలమంత్రిగను, కొంతకాలము నిర్మాణశాఖ మంత్రిగను, తర్వాత న్యాయశాఖ మతశాఖల మంత్రిగను పనిచేసి ప్రశంసను బడసియున్నారు.

వీరిలోనిఒకఉత్తమగుణమువీరితర్వాత వీరిపదవిలో మంత్రిగ ఇంకొకరిని నియమించుపనిని చాల కష్టమైనదానినిగ చేయుచున్నది. కీ॥ శే॥ లుత్ఫుద్దౌలాగారు మంచిముసల్మానులు. అందుచేతనే వీరికి హిందువులపైనగూడ మంచిప్రేమ. వీరికి హిందూముసల్మాను భేదములేదు. మతము పేర చిలికలు దినదినము పెరిగివిషమించుచున్న నేటికాలములో ఇట్టి ఆదర్శపురుషులనష్టము ఎంతయుభరింపరానిది.

నవాబ్ బహదర్‌గారు అరబ్బీ ఫార్సీ విద్యా పండిత పోషకులు, ఉదారహృదయులు. ఇట్టిగొప్పవారి మరణముచే కలిగిన నష్టమునకుచాల విచారపడుచు, వారి కుటుంబమునకు సానుభూతి తెలుపుచున్నాము.

## ఉన్నతవిద్యావిధానము తృప్తిగాలేకపోవుటయే నిరుద్యోగమునకు కారణము

### హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆచార్యుని ఉపన్యాససారము

హైదరాబాదు, అర్దిబెహెష్టు ౩౦ — హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయ రసాయనశాస్త్ర ఆచార్యులగు డా॥ మహ్యుద్దీన్ హుసేన్‌గారు, అలీఘడులో సమావేశమైన అఖిలభారత మహమ్మదీయ విద్యామహాసభలో "వృత్తివిద్య" అనువిషయముపై ఈక్రిందివిధముగ నుపన్యసించిరి —

"భారతదేశమున నిరుద్యోగసమస్య ప్రతినవాటినుండి మనదేశముయొక్క విద్యాసమస్యలయందు శ్రద్ధగైకొని చిసరసు మనప్రస్తుత విద్యావిధానము బాగులేదని తెల్చిరి కాని అట్లు కాదు, ప్రాథమిక, మాధ్యమిక విద్యావిధానము నిస్సంశేహముగా బాగుగాలేదని చెప్పవచ్చును కాని ఉన్నతవిద్యావిధానము అట్లుగాకపూర్తిగా తృప్తికలిగించనిదైయున్నది. ఏలన ఈవిద్యావిధానము ఏదైననొకశాఖకుమాత్రమే లాభప్రధమముగానుండును. మనదేశమునకు వ్యవసాయ పారిశ్రామిక పరిశ్రమలకై ప్రవీణులఅవసరము కలదు కాని ప్రస్తుతవిద్యావిధానము ప్రభుత్వోద్యోగులనుమాత్రము కనుచున్నది అందువలన ప్రస్తుతముగలశాఖల కనుబంధముగాజీవితాశయముల కనుకూలమైన విద్యాసౌకర్యముల కల్పింపవలెను

జర్మనీ ఈవిషయమందు ప్రత్యేకసౌకర్యములు కలవు అక్కడరెండువిధములగు బోధనాలయములు కలవు విజ్ఞానముమరియుశాస్త్రబోధనకై విశ్వవిద్యాలయములును పారిశ్రామికమరియువృత్తివిద్యలకై టెక్నికలుకాలేజీలుకలవు ప్రాథమికవిద్యయందు ఉత్తీర్ణులైనవారిని పారిశ్రామిక వృత్తివిద్యలకై చిన్నచిన్న పాఠశాలలును కలవు.

ఈవిధమున నే మనదేశమందును సౌకర్యములున్న ప్రస్తుతముమనల నావరించుకొనియున్న క్లిష్టసమస్యలు విడిపోవును. కాని పారిశ్రామిక, వృత్తివిద్యలకై సంస్థల నేర్పరచుటలో ఒకవిషయము దృష్టియందుంచవలెను సంస్థల నెలకొల్పిన దేశముయొక్క పరిశ్రమాలయముల కనుకూలముగలిగించు సౌకర్యవిద్య నవలంభించవలెను ఆదేశముయొక్క పరిశ్రమలకొటంకములు కలిగించు విద్యావిధానముపట్ల విమర్శించుటఅవసరము. ఏకొద్దిసంస్థయైనను సహాయము, వృద్ధియైనను బొందుటలేనిదే తమఅభిప్రాయము నెరవేర్పజాలదు అఖిలభారతమునుచేర ఏదైననొకవిశ్వవిద్యాలయముకేన పరిపాలనాసంస్థ ఏర్పడుపబడును. కాని అఖిలభారతమునకుచెందు అన్ని శాఖలకన్వయించు విద్యావిధానము వలంభించుటకూడా సాధ్యమగునని తెలుపవచ్చును రాష్ట్రీలరములో శెఫ్ఫీల్డునందు యినుమపరిశ్రమ, మాంచెస్టరులో ఒట్టలపరిశ్రమ, ఆదేవిధముగభారతదేశములో సరిహద్దురాష్ట్రములందు చక్కెరపరిశ్రమ, బొంబాయినందు బట్టలపరిశ్రమ, విద్యాసౌకర్యములు కలవు. ఈసదర్భలో ప్రవేశపెట్టబడి అమోదించబడిన "పారిశ్రామికవిద్యా" తీర్మానమునే సేకీభవించుచున్నారు మహమ్మదీయులు పారిశ్రమ, వృత్తిసంస్థలనుండి పొందుచున్నలాభములకంటె ఎక్కువలాభమును పొందప్రచారము చేయవలెనవి నాఅభిప్రాయము అట్లుఎక్కువగావచ్చు లాభములన్నప్రచారముల క్రిందను ఉపకారవేతనముల క్రిందను వ్యయపరచుటమంచిది."

నవాబు కమాల్‌యార్‌జంగు బహదురుగారు అలీఘడు మహమ్మదీయ విశ్వవిద్యాలయ కోర్టుయొక్క పట్టీయనిగా పోషకవర్గపక్షమున మూడు సంవత్సరములకై ఎన్నుకొనబడిరి.

## నిజాంరాష్ట్రమున నీటిసౌకర్యమునకై ౭౦ లక్షలు

హైదరాబాదు, అర్దిబెహెష్టు ౩౦ — నేటికిసుమారు ౧౭ సంవత్సరములకుపూర్వము నిజాంప్రభువుగారు, "నేను జిల్లాలపర్యటనసమయమునందు వ్యాకియమైన రైతులసౌకర్యార్థమై మలినజలనాశము, [డ్రైనేజ్] మరియు నీటివసతినిగురించి శ్రద్ధతీసికొనుటకై శాశ్వతసంస్థనెలకొల్ప అత్యవసరము" అని వారు గావించిన ఫర్మానును పాలించు ఉద్దేశముతో ౧౩౩౨ ఫసలీలో నొకసంఘము స్థాపించి, "నీటివసతిమరియు మలినవాశములు" సంఘమను పేరుపెట్టబడెను. ఈసంఘము తనఅభిప్రాయము నె వెల్పుటలో ౪౦ లక్షలరూపాయిలు ఖర్చించి ఔరంగాబాదు, జాల్నా రాయచూరు, పర్భిణి లాతూరు మహబూబునగరమునుమరియు నాందేడునందు కార్యముపక్రమించిరి

ప్రారంభదశయందు సంకల్పించుకొన్నసమస్య ను పరిష్కరించుట ప్రప్రథమములో ఈసంఘమువారి ముఖ్యకర్తవ్యమైయుండెను. దీనికికారణము జాతినిబంధనలేర్పడుట. అనగా ఈసంఘమువారినుండి సహాయ్యముకోరువారిలో ఉన్నతజాతివారికంటె నీచజాతివారి సంఖ్య ఎక్కువగానుండెను. మాదుగులలో, బేగారీలలోభేదము లేర్పడెను

ఒక నూరుసంవత్సరములకు పూర్వము మాదుగులు బేగారీలు ఒకేపద్ధతిపై నుండెడివారు కాని నేడు మాదుగులుకేవలము తమకు ప్రత్యేకముగా బావులుకావలెనని కోరిరి. అట్టివిభేదములుగల వారికి ఇష్టానుసారము బావులుత్రవ్వించవలసివచ్చినది అందుచేత జనసంఖ్యమిక్కిలిగాలేని గ్రామములందు మిక్కిలిసంఖ్యబావులు త్రవ్వించబడినవి బావులుత్రవ్వించి అన్నిజాతుల కనుకూలముగానుండునట్లు మధ్యభాగమున గోడలనిర్మించిరి.

౨౫ సంవత్సరములకుపూర్వము హైదరాబాదునగరమందుకూడా నీటిసౌకర్యముతృప్తికరముగా లేకుండెను, ఉస్మాన్‌సాగరు నిర్మించుటచే హైదరాబాదు, సికింద్రాబాదు పట్టణములలో ప్రతిచోటను నీటిసౌకర్యములోనకూడినవి హైదరాబాదులో నీటివసతికై ఏర్పరచిన స్కీములో ప్రతిరోజు ౧౦ వేలలక్షల గ్యాలనులనీరు అవసరమని తేటపడినది అనగా మనిషిఒకింటి ౨౦ గ్యాలనులనీరు ప్రతిరోజు ఖర్చగుచున్నది పైగుకారణమువనగరములోనివారు దూరముగవసతులనిర్మించుకొనుచుండుటచే ప్రస్తుతము ౪౦ చతురపు మైళ్లదూరము నీరుఅందించవలసి యున్నది. జనసంఖ్యాభివృద్ధి సూచనలుపొడముటచే ప్రత్యేకశ్రద్ధతో నీటివసతిచేయుటయును అత్యవసరము, మనిషి ఒకి ౪౫ గ్యాలనులనీరు ప్రతిరోజు ఖర్చుకావచ్చునని ఊహించుచున్నారు కొట్టి ఆట్టిపద్ధతిని అవలంభించుటకుగాను ౭౦ లక్షలస్కీము సిద్ధపరచియున్నారు ఈస్కీము త్వరలో ఆచరణకువచ్చుటకుగాను ౧౫ లక్షలరూపాయిలు ప్రభుత్వమువారు అనుమతించినారు.

### ప్రభువుగారి రజతోత్సవము

ఇంకను జిల్లాలనుంచి ప్రభువుగారిరజతోత్సవము వైభవముగాజరుపబడినట్లు వార్తలువచ్చుచునేయున్నవి. ఈవారము ఆట్టివార్తలు మెదకుజిల్లాలోనిఅందోలుతాలూకాలోచేరిన చిలుకోడుగ్రామమునుండియు, జనగామతాలూకాలోని లదునూరునుండియు, మధిరతాలూకాలోని చంద్రగొండనుంచియు వచ్చినవి

### తాత్కాలికమైన టపాఖాన బాయపరచబడుట

రాయచూరు జిల్లాలో పోరాపూరునందు తాత్కాలికముగ ఏర్పరచిన టపాఖానాను బాయపరచిరి.

## దొంగనోట్ల అభియోగము

హైదరాబాదు ౨౮ అర్దిబెహెష్టు దొంగనోటు, అభియోగములోని నేరస్థుడగు, నవాబు నాజర్‌యార్‌జంగు బహద్దురు గారిసమక్షమున జమానతు విజ్ఞప్తులుపెట్టుకొనగా వేసవికాలపు సెలవులకుపూర్వమే జమానతుపై విడుదలచేయు విషయము తీర్మానించుకునని ప్రభుత్వపక్ష వకీలుగారు చెప్పిరి.

### పురపాలకసంఘ పట్టభద్రులసభ

హైదరాబాదు; అర్దిబెహెష్టు ౩౦— పురపాలకసంఘము పట్టభద్రులఆహ్వానసంఘసభాసమావేశము, నవాబు మీరు అక్బరలీఖాన్ బ్యారిష్టరుగారి కార్యాలయమున నవాబుమీర్ అహమదలీఖాన్‌గారి అధ్యక్షతవజరిగెను. అందు ఏకాభిప్రాయముచే శ్రీయుత ప్రేంజీలాల్ జీగారు ఆహ్వానసంఘాధ్యక్షుడుగను, సంఘముయొక్క కార్యభారనిర్వహణకొరకు శ్రీయుత శంకర్జీగారిని కార్యదర్శిగను మౌల్వీమహమ్మదుషా అలంఖాన్, శ్రీయుత పి వి జోషి, మౌల్వీ కరీముద్దీన్ అన్సారి. నవాబు మీర్ అహమదలీఖాన్, శ్రీయుత బి రామకిషన్‌రావు మౌల్వీమహమ్మదు అబ్దుల్కదీరు సిద్దీఖి, శ్రీయుత గోపాల్‌రావు సాహెబ్‌జాదా మీర్ వజీరలీఖాన్, శ్రీయుత శ్రీనివాసరావు, మౌల్వీ జాహిద్అలీకామిల్‌గార్లు సభ్యులుగను ఎన్నుకొనబడిరి

## నూతనరాజ్యాంగ విధానముపై నిరసనము

## సికింద్రాబాదు, హైదరాబాదులో హరతాళము

సికింద్రాబాదు, అర్దిబెహెష్టు ౨౯ నూతన రాజ్యాంగవిధానమును వ్యతిరేకించుమ ఫైజ్‌పూరులో కాంగ్రెసువారు తీర్మానముచేసి అమోదముగూడాబడెనిని ౧౯౩౭ ఏప్రిలు ౧వ తేదివాడు ఆనూతన విధాన మాచరణకు తెచ్చుటకు నియమింపబడిన దినమగుటచే ఆదినము హిందుస్థానమంతటను హరతాళము జరుపవలెనని కాంగ్రెసువారితీర్మానమును పాటింపుమ ఆరోజు సికింద్రాబాదులో హిందువులదుకాణములుమూసివేసిరి జనరల్‌మార్కెటుమొదలగు ముఖ్యస్థలములందేగాక మొత్తముపై దుకాణములుమూసివేయబడెను.

ఈహరతాళము ప్రచారము లేకున్నను దీని మహిమ హైదరాబాదునందుకూడాచేరి సుల్తానుబజారులోని కొన్ని హిందువులదుకాణములు మూసివేసివ్యాపారమునుఆపియుంచిరి.

## వర్ష ప్రమాదములు

హైదరాబాదు, అర్దిబెహెష్టు ౨౮ నిజాంరాష్ట్రమందు జిల్లాలనుండి వచ్చుచున్న వర్షప్రమాదవార్తలు ఘోరముగానున్నవి. అపరిమితమైన వర్షములు, వడగండ్లచే రైతులు చాలానష్టములపాలైనారు. మెదకుజిల్లాఅందోల్ తాలూకా గ్రామమగు ... గ్రామములో చాలాఇండ్లు, పెద్దపెద్దవృక్షములు ఆహుతాలాగిరియుగా నేలవాలినవి. వడగండ్లచే ఇంటికప్పులన్నియు శాశనమైనవి పెంకులుపూర్తిగానశించినవి. ఆదెబ్బలలో వ్యవసాయకొలదిమేకలు, ఒకమనుష్యుడు మరణించెను. మాహిడి ... పై పెంకెపడి హితముగా చెరణు

# స్పెయినులో యుద్ధము

మాడ్రిడు, మార్చి ౩౦:-

విద్రోహుల స్వాధీనమునందున్న బాలియరిక్ దీవులను స్వాధీనపరచుకొనుటకై ప్రభుత్వమువారు కొన్ని యుద్ధనావలను పంపియున్నారు. ఈ యుద్ధనావలు బాలియరిక్ ద్వీపమును చేరినవనియు మజోర్కా రేవుపై తుపాకిగుండ్లవర్షము కురిపించుచున్నారనియు వార్తవచ్చినది.

గుడలజరరంగమున ప్రభుత్వసేనలు మిరాబి గ్రామమును స్వాధీనపరచుకొనినవని ప్రభుత్వమువారు ప్రకటించుచున్నారు. కాని ఈప్రాంతమున ప్రభుత్వమువారికి జయము కలుగలేదని తిరుగుబాటుదారులు ప్రకటించుచున్నారు.

లండను, మార్చి ౩౦:-

తిరుగుబాటుదారులు ఇటీవల మూడు బ్రిటిషు నావలపై తుపాకులను పేల్చియుండిరి. నీమకు ఏదేశమునకు చేరినదో తెలిసికొనుటకై తుపాకులను ప్రేల్చుట తప్పుపద్ధతియనియు అంతర్జాతీయ సంప్రదాయములకు విరుద్ధమగు కార్యమనియు మరలయిట్టి సంఘటనములు జరుగకుండునట్లు తిరుగుబాటుదారుల నాయకులు పూచీయివ్వవలయునని కోరుచునట్లుగ బ్రిటిషు ప్రభుత్వమువారు మెడటరేనియను ప్రాంత్యమందలి తమనౌకాదళాధికారికి ఉత్తరువులనుపంపిరి.

మతప్రవక్తల రాయబారములు

పారిస్, మార్చి ౩౦:-

స్పెయిను ప్రభుత్వమువారి స్వాధీనమునందున్న రాష్ట్రభాగమునలో మతవిషయములకు సంబంధించిన స్థితిగతులు ఏవిధముగనున్నవో తెలిసికొనుటకు కొంటురుగుడీనుగారు మరికొంతమంది మతబోధకులు ఇంగ్లండునుండి ఇప్పటికి వచ్చిరి. స్పెయినుకుపోవుటకు బ్రిటిషు ప్రభుత్వమువారు వీరికి పాస్‌పోర్టులనివ్వలేదు. కాని ఫ్రాన్సుప్రభుత్వమువారు పాస్‌పోర్టులనిచ్చిరి. వీరు రేపటిదినము స్పెయినుకు ప్రయాణమయ్యెదరు.

ఇటలీ సైనికుల కుట్ర

మలాగ, మార్చి ౩౦:-

ఆల్జిసిరాస్‌నందు ౨౦మంది ఇటలీసైనికులు తిరుగుబాటొనర్ప కుట్రపన్నిరని సందేహము కల్గుటచే తిరుగుబాటుదారుల నాయకులు వీరికందరకు మరణదండన విధించి, తుపాకులతో కాల్చిచంపిరట.

అడిసుఅబాబా హత్యలు

ఇటలీప్రకటన

రోము, మార్చి ౩౦:-

అడిస్ ఆబాబా హత్యలను గురించి బ్రిటిషుపత్రికలు గావించిన ఆరోపణలకు ప్రత్యుత్తరముగ సీనరు గయాడగారు "ఇటాలియా పత్రిక" యందు ఇట్లు వ్రాసిరి. అడిస్ ఆబాబాలో ఇటలీసైనికులు నగరవీధులలో అబిసీనియులను కాల్చిచంపిరనియు ఎన్నియో యిండ్లను తగులబెట్టిరనియు బ్రిటిషుపత్రికలయందు ప్రకటింపబడిన వార్తలు కేవలము నిరాధారములైనవి. ఆయుధసామగ్రి నిలువచేసియున్న ఇండ్లను మాత్రమే ఇటలీసైనికులు తగులబెట్టిరి.

ఇటలీప్రభుత్వరహస్యములను కనుగొనుటకై చారులనుపంపుచున్న కొన్ని విదేశపత్రికా సంస్థలను ప్రభుత్వమువారు మూసివైచిరి.

మాడ్రిడు: ఏప్రిలు ౧౫

బాస్కురాష్ట్రమున ఉభయసేనలకు ఘోరమగుయుద్ధము ప్రారంభమైనది. విజ్ఞారియాలు ప్రాంతమున విద్రోహులు హఠాత్తుగ ప్రభుత్వసైనికులనెదిరించి మూడుగ్రామములను స్వాధీనపరచుకొనిరనియు, వందలకొలది సైనికులను చంపిరనియు, కొంత ఆయుధసామగ్రిని, కొందరు ఖైదీలను స్వాధీనపరచుకొనిరనియు వార్త వచ్చినది.

వలెన్షియా: ఏప్రిలు ౧

కార్డోవరంగమున అల్మాడెను సమీపమునున్న పాదరసపుగనులు ప్రభుత్వసేనల స్వాధీనమందున్నవి- ఈప్రాంతమువందున్న ప్రభుత్వసేనలనోడించి ఈగనులను స్వాధీనపరచుకొనవలయునను ఉద్దేశముతో అన్ని సన్నాహములు గావించుకొని యుద్ధము ప్రారంభించిరి- నిన్నటిదినము ఛోజోబ్లాంకోనందున్న ప్రభుత్వసైనికులనెదిరించిరిగాని ప్రభుత్వసేనలు వారల సేనలను సంపూర్ణముగ చెదరగొట్టెను- అంతేకాక విద్రోహులకై స్వాధీనమునందున్న ముఖ్యమగు గ్రామములను కొన్నిటిని ప్రభుత్వసేనలు స్వాధీనపరచుకొనినవి- దీనివల్ల అల్మాడెనుపాదరసపుగనులను సంరక్షించుటకు ఎక్కువ అనుకూలపరిస్థితులుఏర్పడినవని ప్రభుత్వమువారు తెలుపుచున్నారు-

కాని ఈవార్తలు నిరాధారములైనవని సెవిల్లినుండి తిరుగుబాటుదారుల నాయకులు బ్రాడుకాస్టుద్వారా ఒకప్రకటన గావించుచున్నారు- ఈవిజయము సంపూర్ణమైనదనియు, దీనివల్ల ఈప్రాంతమున తిరుగుబాటుదారులకు గొప్పనష్టము కలిగినదని చెప్పవచ్చుననియు యుద్ధమున తిరుగుబాటుదారులు వందలకొలదిమంది మరణించిరనియు వలెన్షియానుండి వార్తలువచ్చుచున్నవి-

మాడ్రిడు: ఏప్రిలు ౧

గుడలజరరంగమున ప్రభుత్వసేనలు మరికొన్ని మైళ్లముందుకునడిచి సెలిసిస్ గ్రామమును స్వాధీనపరచుకొనిరి-

వలెన్షియా: ఏప్రిలు ౧

నేటిదినము విద్రోహుల విమానములు రెండుపర్యాయములు డ్యూరింగోనగరముపై బాంబులనువేసిరి- నగరవాసులలో రెండువందలమంది మరణించిరి- నగరమునందలి పొలములవెంటపరుగెత్తుకొనిపోవుచున్న గ్రామస్థులు మీదకూడ బాంబులను వేయబడెను-

హెండే: ఏప్రిలు ౧

౧౯౩౦ సంవత్సరపు తరగతులను చేరిన వారందరు వెంటనే సేనయందు చేరవలయునని జెనరలు ఫ్రాంకోగారు ఉత్తరువులను ప్రకటించిరి- సైనికశాఖపునర్నిర్మాణమునకును, క్రొత్తగ చేరు సైనికులకు శిక్షగరపుటకును తగు ఏర్పాటులు గావించుటకు జెనరలు సోర్గాజ్‌గారు ప్రత్యేకోద్యోగిగ నియమింపబడిరి.

గూఢచారిణికి మరణదండన

బార్సిలోనా: ఏప్రిలు ౧

కిరవెంనిట్ అను ౨౫ సంవత్సరముల స్త్రీ గూఢచారిణిగ పనిచేయుచుండెనను నేరముపై కోటలోనియా ప్రభుత్వాధికారులు మరణదండన విధించిరి- ఈమె ఫ్రాన్సుదేశస్థురాలు నాట్యవిద్యయందు పేరుగాంచినది.

జిబ్రాల్టరు: ఏప్రిలు ౧

స్పెయిను ప్రభుత్వముగారు తమ నౌకాశాఖయందు మంచిఅనుభవముగల రష్యా, అమెరికా, ఫ్రాన్సు ఉద్యోగులను నియమించిరనియు వీరియుత్తరువులననుసరించి స్పెయిను ప్రభుత్వపు యుద్ధనావలు జిబ్రాల్టరుప్రాంతములందు తిరుగుచున్నవనియు సెవిల్లియందొక పత్రికయందొక ప్రకటన గావింపబడినది.

## క్రొత్త రెసిడెంటు

[illegible] ప్రావిన్సు హోం మెంబరుగనున్న [illegible] గారు హైదరాబాదు [illegible] వీరు ౧౯౩౭ ఏప్రిలు [illegible] ఢిల్లీ [illegible] మెక్‌న్జీగారు [illegible] వీరుకూడా అక్కడికే వెళ్లెదరు.

## విద్యుచ్ఛక్తి చేమరణము

హైదరాబాదు, [illegible] ౩౦:-

ప్రభుత్వవిద్యుచ్ఛక్తి శాఖోద్యోగి అగయ్య అనువతడు ముషీరాబాదునందు ఒకవిద్యుచ్ఛక్తి స్తంభముపైకెక్కెను. ఆతడు కరెంటుఆపివేయబడెననితలచి వైరును ముట్టెను. వెంటనే సుమారు ౨౦ అడుగులఎత్తుగల స్తంభమునుండి క్రిందపడి వెంటనే మరణించెను. పోలీసువారువచ్చి పంచనామాచేసి అకస్మికప్రమాదమువలన మరణమని తేల్చి పూడ్చించిరి.

## గాంధీజీకి నోబిల్ బహుమానము

యూరోపుఖండములో ప్రతిసంవత్సరము సుమారొక లక్షరూపాయీలకన్న మించిన మొత్తము ప్రపంచమంతటను గొప్పవారిని నిర్ణయింపబడినకవికి, శాస్త్రజ్ఞునికి, శాంతిస్థాపకునికి, మున్నగువారికి [ఒక్కొక్కరికి ఒకలక్ష చొప్పున] ఇచ్చుచుందురు- కొన్ని సంవత్సరములనుండి ప్రతిసంవత్సరము యెవ్వరెవ్వరికో శాంతిబహుమానము ఇచ్చుచున్నారుగాని గాంధీగారి పేరుకూడ ఎత్తువారులేరైరి-

నిజముగా ఆలోచించిచూచిన ప్రపంచమందు శాశ్వతముగు శాంతిని నెలకొల్పుటకును, ప్రపంచమందు ఇకముందు యుద్ధములుండకుండుటకు, ప్రపంచనాశనము ఇకముందు నానావిధ మారణోపాయములచేత కాకుండుటకును మార్గము కనిపెట్టినవారెవరనగా ఒక్క గాంధీగారే- వారియుద్ధము అపూర్వమగుయుద్ధము. నేటివరకు ప్రపంచములో ఎచ్చటను గానిలేదు- వారియుద్ధములో ప్రతిపక్షులుచావరు- గాంధీగారిపక్షమున యుద్ధములో చేరినవారికేచావులు, జెయిళ్లు, ద్రవ్యనష్టి, శరీరశుద్ధి మున్నగుకష్టములు కలుగును- ప్రతిపక్షులకు ఇంకను కొట్టుటకు, ఇంకను హింసించుటకు అవకాశము లిత్తురు-

ఇట్టిశాంతిదూత పేరును ఈసంవత్సరము నోబిల్ బహుమానసంఘమువారికి సూచించినారనివిని ఆమాత్రమునకే సంతోషించినాము-గాంధిగారికి అట్టి బహుమతు అవసరములేదు- వారు నిష్కామకర్ములు- ఇచ్చినను సరే ఇవ్వకున్నను సరే వారి సచ్చిదానందములో ఏమియు లోటుండదు- కాని పాశ్చాత్యప్రపంచములో వారిశాంతి సమరమునుగురించి అర్థముచేసికొని సానుభూతిచూపువారు కనబడుచున్నారుకదా యని సంతోషించుచున్నాము-

## నూతన రాజ్యాంగ శాసన ప్రారంభదినము

ప్రమాణము గైకొన్న మంత్రులు

ఏప్రిలు ౧వ తేదీనాడు నూతనరాజ్యాంగము కుంటెగనో మొత్తగనో అమలుకు తేబడినది. మదరాసు, బొంబాయి మధ్యరాష్ట్రము, బీహారు, సంయుక్తరాష్ట్రము, ఒరిస్సా-అను ఆరు రాష్ట్రములలో శాసనసభలయందు కాంగ్రెసు మహాసభ్యుల సంఖ్యయే హెచ్చుగనుక, ఆయా శాసనసభల కాంగ్రెసు నాయకులను గవర్నర్లు, నూతనశాసనమున కనుబంధముగ [illegible] సంప్రదాయప్రకారము, పిలిపించిమంత్రివర్గము ను నేర్పరుచగోరుటయు, ఆనాయకులు, తమ కాంగ్రెసుసంస్థ నిర్ణయముప్రకారము గవర్నరులనుండి కోరినవాగ్దానములు నిరాకరించబడుటచే తాము మంత్రివర్గముల నేర్పరుచుటకు నిరాకరించుటయు అందరికిని తెలిసినదే. ఇట్లు శాసనసభలలోని అధికసంఖ్యాకపక్ష నాయకు[లు మం]త్రివర్గము నేర్పరుచ నిరాకరించుటచే గవర్నర్లు మదరాసులో కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారిని. బొంబాయిలో సర్ డి. బి. కూపరుగారును, బీహారులో మహమ్మదు యూనసుగారును, ఒరిస్సాలో పర్లాకిమిడి మహారాజుగారును. మధ్యరాష్ట్రములో సి. రాఘవేంద్రరావుగారును మంత్రివర్గమును నిర్మింప గోరబడిరి. వారు కోరికప్రకారము నిర్మించిన వర్గములు ఏప్రిలు ౧వ తేదినాడు రాజభక్తిప్రమాణముల జేసి అధికారస్వీకారము చేసినవి, అన్యప్రవర్గముల లో మంత్రులపేర్లును, కాంగ్రెసుపక్ష సభ్యుల అధిక సంఖ్యాకులు లేని శాసనసభలుగల రాష్ట్రములలో ఇతరపక్షనాయకులు గవర్నర్ల కోరికపై ఏర్పరచిన మంత్రివర్గములలోని మంత్రుల పేర్లను ఈక్రింద ప్రకటింపబడుచున్నవి. ఈ మంత్రులుకూడ ఏప్రిలు ౧వ తేదినాడు రాజభక్తి ప్రమాణముచేసి అధికారస్వీకారము చేసిరి.

మదరాసు రాష్ట్రములో ప్రధానమంత్రి సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడుగారు. ఇతరమంత్రులు, రావుబహదూర్ ఎ. టి. పన్నీరుసెల్వం కుమారరాజా ముత్తయ్యచెట్టి, ఆర్. ఎం. పంటు, పి. కాలిఫుల్లా, ఎం. సి-రాజాగార్లు-

బొంబాయిరాష్ట్రములో ప్రధానమంత్రి సర్ డి-బి-కూపరుగారు, ఇతరమంత్రులు,సర్ ఎస్-టి- కంబ్లి, జమునాదాసు మెహతా, హుస్సేనాలీరహీంతుల్లాగార్లు, హుస్సేనాలీగారు, అసెంబ్లీసభ్యుడు కాకపోయినను క్రొత్తచట్టములో ప్రత్యేకనిబంధననుబట్టి వీరినికూడా మంత్రిగానియమించిరి- అని నిన్న బొంబాయి గవర్నరు అంతరంగికార్యదర్శి ప్రకటించెను-

సింధురాష్ట్రములో ప్రధానమంత్రి సర్ గులాంహుస్సేను హిదాయతుల్లాగారు- ఇతరమంత్రులు ముఖీగోవిందరాం, మీర్ బందాలీగార్లు-

బెంగాలురాష్ట్రములో ప్రధానమంత్రి ఏ.కె.ఫజలుల్ హకుగారు- ఇతరమంత్రులు ఎస్-ఆర్-సర్కారు, సర్ నజీముద్దీన్, సర్ బి-పి- సింగురాయి, జెకానవాబుబహదరు, కాశింబజారుమహారాజా, హెచ్-ఎస్- సుహ్రవర్దీ, నవాబుముషరీఫుహుస్సేను. మౌల్వీనవుశరాలి,పి-డి-రైకటు, ఎం-బి- ముల్లిక్‌గార్లు-

బీహారురాష్ట్రములో ప్రధానమంత్రి మహమ్మదుయూనసుగారు- ఇతరమంత్రులు కుమారఅజితప్రసాద సింహదేవు, బాబు గురుసహాయిలాలు, నవాబు ఖానుబహద్దురు అబ్దుల్ వహాబుఖాన్గార్లు-

ఒరిస్సారాష్ట్రములో ప్రధానమంత్రి పర్లాకిమిడిమహారాజుగారు- ఇతరమంత్రులు ఎం-జి-పట్నాయకు. లతీఫురు రహిమానుగార్లు-

పంజాబురాష్ట్రములో ప్రధానమంత్రి ఖాన్‌బహదర్ సర్ సికిందర్ హయతుఖానుగారు- ఇతరమంత్రులు సర్ సుందరసింగు మజీథియా,రావుబహదర్ చౌదరీఛోటూరాం, మనోహరలాలు, మాలికుఖిజారుహయతుఖాన్ దివానా మియాన్ అబ్దుల్ హైగార్లు.

అస్సాముమురాష్ట్రములో ప్రధానమంత్రి సర్ సయ్యదుమహమ్మదు సదుల్లాగారు- ఇతరమంత్రులు రోహిణీకుమారచౌదరీ, ఇకరెండు జె-జె-ఎం-నికలసురాయ్, సంషుల్ ఉలేమా మౌలానా అజాదషీరు, మహమ్మదువహీదుగార్లు మరియొకమంత్రిపేరు ఏప్రిలు ౧ వాడు ప్రకటించబడలేదు-

సరిహద్దురాష్ట్రములో ప్రధానమంత్రి సర్ సాహెబుజాదా అబ్దుల్ ఖయ్యూంఖాన్, కె-సి-ఐ-ఇ-గారు- ఇతరమంత్రులు రా॥ రాయబహదూరు మెహరచందుఖన్నా, ఖా॥ ఖాన్‌బహదర్ సదుల్లాఖానుగార్లు-

బర్మాదేశములో

ప్రధానమంత్రి:-డా॥ బామాగారు.

ఇతరమంత్రులు:- యు-పా-టను, యు-పు-యు- హూటూను అంగుగ్యా సా-పే- థా ఆవాడియాంగు మాంగుగార్లు-

### మదరాసు శాసనసభ కౌన్సిలులో నామినేటెడుసభ్యులు

౧ సర్ కూర్మా వెంకటరెడ్డి నాయుడు
౨ మహమ్మద్ ఉస్మాను
౩ వై-హో-వి-యస్- శ్రీనివాసశాస్త్రి
౪ కట్టమంచి రామలింగారెడ్డి
౫ డా॥ పి-జె- థామస్
౬ దీ॥బ॥ ఆర్- శ్రీనివాసన్
౭ హెన్సుమనుపతి
౮ రా॥బ॥ యం- రామర్

గార్లను గవర్నరు మదరాసు కౌన్సిలులో సభ్యులుగా నియమించెను- మరియిద్దరినిగూడ నియమించుటకు గవర్నరుకు అధికారమున్నదిగాని ప్రస్తుతము వారిని నియమించలేదని తెలిసినది-

ఉస్మాను, థామస్ గార్లు ౯ సంవత్సరములకును. సర్- కూర్మా, శ్రీనివాసశాస్త్రి, రామలింగారెడ్డిగార్లు ౬ సంవత్సరములకును, శ్రీనివాసను, రామను, హెన్సుమనుపతిగార్లు మూడేండ్లవరకును సభ్యులుగానుందురు-

## స్పెయినులో యుద్ధం

వాలెన్షియా: మార్చి ౨౭

పోజ్లో బ్లాంకో సమీపమున అల్మ డానులోని పాదరసపుగనులు ప్రపంచములో కెల్ల చాల గొప్పవి. స్పెయినులో యుద్ధము ప్రారంభముకాక పూర్వము ఆగనులనుండి పాదరసమును ముస్సోలీని ఇటాలీయులకు పెనీలను కంట్రాక్టున కిచ్చియుండెను. స్పెయినులో యుద్ధము ప్రారంభమైనతోడనే ఆగనులు తిరుగుబాటుదారుల వశమయ్యెను. ఆ పాదరసపుగనులను వశపరచుకొనుటవల్ల ప్రపంచములోని పాదరసపు వ్యాపారమంతయును వశపరచుకొనుటయగును. ఇప్పుడు పాదరసమునకు ప్రపంచమంతటను హెచ్చుగిరాకీ గానున్నది. అందువల్లయీగనులను వశపరచుకొనవలెనని విద్రోహులు కటాలములు ప్రయత్నము చేయుచున్నవి. గతరోజులు యుద్ధము జరిగెను. గతరోజున ప్రభుత్వమువారికి క్రొత్తపటాలములువచ్చుటవల్ల బలము హెచ్చెను. విద్రోహులు తరుమగొట్టబడిరి. వారిపక్షమున పోరాడిన ఇటలీయులకు చాలనష్టముకలిగెను.

### బాంబులు

సెవిల్లి: మార్చి ౨౮

గుడలజారావద్దను, మాడ్రిడువద్దను విద్రోహులు విమానములమీదనుండి బాంబులను ప్రయోగించిరి. గిజాను పాంటాంధనయమీదకూడ బాంబులనువేసిరి. ప్రభుత్వ పటాలములలో ౩౦౧మంది విహాస్పిగా కొండలమీద ఖైదీలుగా పట్టుబడిరి అని విద్రోహులు తెలుపుచున్నారు.

### మంత్రుల రాజీనామా

బార్సిలోనా: మార్చి ౨౮

స్పెయిను మంత్రివర్గమునందు పలుగురు రాజీనామానిచ్చిరి. మంత్రివర్గమునందు అభిప్రాయభేదము లేర్పడుటయేకారణము. ప్రజలనందరిని సైనికులగాతయారుచేసి పటాలము లేర్పరచు విషయములో మంత్రివర్గము ఏకముఖముగా కృషిచేసి శత్రువు నెదుర్కొనవలెనని యున్నారు. రాజీనామానిచ్చినమంత్రులు అనార్కిస్టుపక్షమువారు. మంత్రివర్గములో ఏర్పడిన వివాదమును సర్దుబాటు చేయుటకు అధ్యక్షుడు కృషిచేయుచున్నాడు.

### అమెరికాలోని సామ్యవాదపక్షమువారి సానుభూతి

వాలెన్షియా: మార్చి ౨౭

అమెరికాలోని సామ్యవాదపక్షముతరఫున సామ్యవాదులపరాకము నామ్ బారను గారిద్వారా స్పెయినువిదేశాంగమంత్రియగు డెల్వాయోగారికి కానుకగా సమర్పింపబడెను. స్పెయినులోని సామ్యవాదప్రభుత్వముతో అమెరికాలోని సామ్యవాదపక్షము ఐక్యభావముతో నున్నదనిసూచించుటకై ఈపతాకము పంపబడినదని తెలియజేయబడెను.

### లండను ఒడంబడికను జపాను రద్దుచేయుట

టోకియో. మార్చి ౨౭

యుద్ధనౌకలమీద ఉండబడేపరంగుల రంధ్రనాళము ౧౪ అంగుళముల పరిమితికి మించియుండరాదనునిబంధనకు జపానువారు కట్టుబడియుండజాలరని తెలియజేయుచు జపాను ప్రభుత్వమువారు వ్రాసిన ప్రత్యుత్తరమును జపాను విదేశాంగమంత్రి బ్రిటిషురాయబారికి నేడు టోకియోలో నిచ్చెను.

## కాంగ్రెసుసభలలో హిందీవలనకష్టము

దక్షిణాభారతీయులఘోష

మదరాసు, మార్చి ౨౬:-

కాంగ్రెసుసభల సమావేశములందు కార్యక్రమంతయు హిందీలోనే జరుపుట, ఆంగ్లము లేకుండ చేయుటనుగూర్చి నిన్నసాయంకాలము కాంగ్రెసువాదులు, పురప్రముఖులు, పత్రికాధిపతులు దక్షిణభారత హిందీప్రచారభవనములందు సంభాషించిరి.

హిందీరానివారు తమ మాతృభాషలలో మాట్లాడుటకును, వీరిభావములను హిందీలోనికి తర్జుమాచేయుటకును అవకాశముండవలెననిసూచించిరి. అఖిలభారత కాంగ్రెసు సంఘసభలో ముఖ్యమైనవిషయములను హిందీలోచర్చించుటవలన దక్షిణభారతీయులకు కొందరికి చిక్కుగానున్నదనియు వొటవేదీవిషయమై తగుశ్రద్ధవహింపవలెనని కొందరుకోరిరి.

కొంతగడువొసంగి, తగినపూర్వయొనత ర్వాత కాంగ్రెసు సభలలో ఆంగ్లమునకుస్థానమే లేకుండ చేయువట్లు మహాత్ముడు చెప్పినటుల తెలియుచున్నది. దీనివిషయమై హిందిసాహిత్య సమ్మేళనములో తీర్మానమొకటి ఉపపాదించెదరట.

## సరిహద్దు రాష్ట్రములలో యుద్ధము

క్రొత్తఢిల్లీ మార్చి ౨౯:-

గడచిన రెండుమూడుదినములనుండి ఉత్తర వజీరుస్థానములో పరిస్థితులు శాంతపడియున్నవి. ఉత్మంజీ వజీరుమాలికులు ఇఫిఫకీరుతో రాయబారములను జరుపుచుండుటచేత అట్టిపరిస్థితులు ఏర్పడియుండవచ్చును. గవర్నమెంటుతో సమాధానపడువిషయమై ఇఫీఫక్కీరు తనఅనుచరబృందముతో నాలోచించి, తరువాత ఏషరతులతో సమాధానపడుటకు అంగీకరించునో అవయవసరమును వివరించుచు గవర్నమెంటుకు ఇపీఫక్కీరు ఒకలేఖ వ్రాయుచున్నని తెలుపబడుచున్నది.

### శత్రువులు ౫ వందల గుంపులు అప్రదేశములో చేరియుండుట

ఉస్మాన్ జాయి వజీరు పతినిధుల వర్గము యీసెల ౨౭వ తేదిన, ఇప్పిఫక్కీరును ౨౭వ తేది మిత్రత్వమునకియ్యకొనినవి టోరిఖేలులనుచూడనున్నారు, అదిఅట్లుండ, శత్రువులైన సరిహద్దులజాతులవారిగుంపులు ఖైయిసోరా మైదానమునందును, దానికిసమీపమున ఉత్తర వజీరుస్థానములోను రమారమిఐయిదువందలు చేరియున్నటు తెలియుచున్నది. వారు అంతరిగెలను తెగొట్టుటతప్ప మరేమి దారుణకృత్యము లనొనరింపలేదు. మదభేల్ వజీరుల మూక యొకటి ఒన్నజిల్లాలో దుండగములనొనర్చుటకు లక్కాలోనికజొచ్చినవి. కాని ఏమియు చేయజాలక మరలిపోవలసివచ్చెను.

### పంజాబు గవర్నరు విందుకు కాంగ్రెసువారు పోకుండుట

లాహోరు మార్చి ౨౯:-

పంజాబు రాష్ట్రీయగవర్నరు ఎమర్సన్ గారు నేటిసాయంకాలము విందుజేసిరి. నూతనముగ శాసనసభకు ఎన్నుకొనబడిన సభ్యులలో కాంగ్రెసుప్రతినిధులును, కాంగ్రెసు అభిమానులు మతప్ప, మిగిలినవారందరును గవర్నరుగారి ఆతిథ్యమును స్వీకరించిరి.

### బియ్యపునూకలపై సుంకము

క్రొత్తఢిల్లి: మార్చి ౩౦:-

భారతదేశములోనికి దిగుమతిఅయ్యెడిబియ్యపునూకమణుగు ఒకటింటికి పండ్రెండణాల చొప్పునసుంకమును వసూలు చేయుటకు ఒకబిల్లునేడు అసెంబ్లీలో ప్రవేశపెట్టబడెను. ఈబిల్లు ఆమోదింపబడినతోడనే అచరణకువచ్చును.

